


యశోద చారిటబుల్ ఫౌండేషన్‌లో వివిధ వృత్తి విద్యా కోర్సుల్లో శిక్షణ తీసుకుంటున్న విద్యార్థులు

# అనాథల.. ఆశాజ్యోతి

## యశోద చారిటబుల్ ఫౌండేషన్

- అనాథ యువతకు వెలుగు దారి చూపుతున్న వేదిక
- ఒంటరి జీవితాల్లో విశ్వాసం నింపుతున్న యశోద గ్రూప్ సీఎండీ
- వృత్తి విద్యలో శిక్షణనిస్తూ ఆదర్శంగా నిలుస్తున్న రవీందర్‌రావు

కష్టసుఖాలు తెలిసిన వారే.. ఇతరుల కష్టాలను అర్థం చేసుకుంటారనేందుకు యశోద గ్రూప్ చైర్మన్ అండ్ మేనేజింగ్ డైరెక్టర్ జి.రవీందర్‌రావే నిదర్శనం. 'సొంత లాభం కొంత మాని.. పొరుగు వారికి తోడ్పడవోయ్' అన్న గురజాడ సూక్తిని అక్షరాలా ఆచరిస్తున్న వ్యక్తి ఆయన. యశోద చారిటబుల్ ఫౌండేషన్ స్థాపించి అనాథ యువతకు వృత్తి శిక్షణ అందిస్తున్నారు. మానవ సేవే మాధవ సేవగా భావించి యువతను ఉన్నత శిఖరాల వైపు నడిపిస్తున్న రవీందర్‌రావు కృషి ఎందరెందరికో స్ఫూర్తిదాయకం. అనాథ యువతలో ఆత్మవిశ్వాసాన్ని నింపుతున్న యశోద చారిటబుల్ ఫౌండేషన్ విశేషాలు మీకోసం..

సికింద్రాబాద్, టీ మీడియా :

జీవితంలో లక్ష్యం సాధించాలన్నా దృఢ సంకల్పం అవసరం. తల్లిదండ్రులు, కుటుంబానికి దూరంగా బతికే వారికి ప్రపంచం అత్యంత భయానకంగా ఉంటుంది. జీవితం అగమ్యగోచరంగా కనిపిస్తుంది. చుట్టూ ఉన్న సమాజంపై కొన్నిసార్లు కోపం వస్తుంది. ఒంటరితనంలోంచి వివేచన కోల్పోయే స్థితికి చేరుకుంటారు. అలాంటి వారిలో ఆత్మవిశ్వాసం నింపితే.. సరైన మార్గనిర్దేశం చేస్తే.. ఉన్నత శిఖరాలకు చేరుకుంటారు. అలాంటి కర్తవ్యాన్ని భుజానికెత్తుకుంది యశోద చారిటబుల్ ఫౌండేషన్. అనాథ పిల్లలకు ఉపాధి కల్పించి.. వాళ్లు జీవితంలో స్థిరపడేలా ప్రోత్సహించే ఉద్దేశంతో రవీందర్‌రావు 2011లో ఈ ఫౌండేషన్‌ను స్థాపించారు. ఇప్పటి వరకు వేలాది మందికి శిక్షణ ఇచ్చి, ఉపాధి అవకాశం కల్పించిన ఈ ఫౌండేషన్ సేవలను ప్రతి ఒక్కరూ కొనియాడుతున్నారు.

### ఆర్థిక స్వావలంబన...

ఇక్కడ శిక్షణ పొందిన వారు ఎలాంటి క్లిష్టపరిస్థితుల్లోనైనా ఇతరులపై ఆధారపడకుండా ఆర్థిక స్వావలంబన సాధిస్తున్నారు. అంతేకాదు.. జీవన గమనంలో ఎదురయ్యే సమస్యలను అధిగమించేందుకు అవసరమైన కౌన్సెలింగ్ అందిస్తోంది సంస్థ. ఇప్పటి వరకు 2108 మంది విద్యార్థులు ఈ ఫౌండేషన్‌లో శిక్షణ పొందగా, 1882 మంది ఉద్యోగాలు పొందారు. ప్రస్తుతం 146 మంది శిక్షణ పొందుతున్నారు. విద్యార్థులకు ఇంగ్లిష్‌ను బోధిస్తూ వారిలో ఆత్మవిశ్వాసాన్ని పెంపొందిస్తోంది. అలాగే, కంప్యూటర్ పరిజ్ఞానం అందిస్తోంది సంస్థ.



### ఆత్మవిశ్వాసం నింపుతాం

అనాథ పిల్లల్లో ఆత్మవిశ్వాసం నింపి, స్వావలంబన దిశగా వారిని నడిపించేందుకే ఈ సంస్థను ప్రారంభించాం. పదో తరగతి పూర్తి చేసిన 18 నుంచి 20 ఏళ్ల మధ్య వయసు ఉన్న అనాథ యువతకు 65 రోజుల పాటు ఉపాధి అనుబంధ శిక్షణ ఇవ్వడంతోపాటు ఉచిత భోజనం, వసతి, ఉపకార వేతనాలు కూడా అందిస్తున్నాం. శిక్షణ పొందిన వారికి ఆస్పత్రులు, బీపీఓ, ఎంఎన్‌సీ కంపెనీల్లో ఒప్పందాలు కుదుర్చుకుని ఉపాధి కల్పిస్తున్నాం. ఒక్కొక్కరిదీ ఒక్కో నేపథ్యం.. కుల, మత, ప్రాంత భేదాలు లేకుండా ఇక్కడ శిక్షణ పొందుతున్నారు. నైరాశ్యంలో ఉన్న అనాథలను ఆత్మవిశ్వాసంతో తమ కాళ్లపై తాము నిలబడగలిగేలా తీర్చిదిద్దుతున్నాం. సమస్యలను అధిగమించేందుకు అవసరమైన సానుకూల దృక్పథాన్ని అందించేందుకు కౌన్సెలింగ్ ఇప్పిస్తున్నట్లు 'యశోద' గ్రూప్ సీఎండీ రవీందర్‌రావు వివరించారు.




### ట్యూటర్ల నియామకం

అనాథాశ్రయాల్లో ఉంటూ పాఠశాల విద్యనభ్యసిస్తున్న విద్యార్థుల్లో మెరుగైన ప్రతిభను వెలికితీసేందుకు ప్రత్యేకంగా ట్యూటర్లను నియమిస్తున్నారు. 8,9,10వ తరగతి విద్యార్థులు గణితం, సైన్స్, ఇంగ్లిష్ వంటి క్లిష్టమైన సబ్జెక్టుల్లో మంచి నైపుణ్యం పొందడానికి ట్యూటర్లు దోహదపడుతున్నారు. 10వ తరగతి పూర్తి చేసిన విద్యార్థులు వృత్తి విద్యా కోర్సు అభ్యసించేందుకు ఫౌండేషన్ సహకరిస్తోంది. డీఎంఎల్, ఎంపీహెచ్‌డబ్ల్యూ, ఈసీజీ టెక్నీషియన్స్, సీఎస్ఏతోపాటు ఎలక్ట్రీషన్, ప్లంబింగ్, డ్రైవింగ్, కార్పెంటర్ వృత్తుల్లో ఆసక్తిని బట్టి శిక్షణ అందిస్తున్నామని సంస్థ చైర్మన్ రవీందర్‌రావు తెలిపారు. ఎవరైనా వివరాలు కావాలనుకుంటే www.yashodafoun dation.inలో సంప్రదించాలన్నారు.

### ధైర్యం వచ్చింది



మాది అంబర్‌పేట్. ఇంటర్మీడియెట్ పూర్తి చేశాను. ఇక్కడికి వచ్చాక ఎవరిపై ఆధారపడకుండా నా కాళ్లపై నేను నిలబడగలనన్న ధైర్యాన్ని కూడగట్టుకోగలిగాను. జీవితంలో ఎదగడానికి ఈ శిక్షణ ఎంతో ఉపయోగపడుతోంది. ఇక్కడ సమాజంలో ఎవరితో ఎలా మెలగాలో నేర్పించారు. మంచి ఉద్యోగం సాధిస్తానన్న నమ్మకం కలిగింది

- పి.మాధురి

### బాధలన్నీ మర్చిపోయా



మాది వైజాగ్. చిన్నప్పుడే తల్లిదండ్రులు చనిపోవడంతో మా అత్తయ్యవాళ్ల వద్ద పెరిగాను. అమన్ వేదిక సంస్థ ద్వారా నేను ఈ ఫౌండేషన్‌లో చేరాను. చిన్నప్పటి నుంచి ఎన్నో కష్టాలు అనుభవించాను. ఇక్కడికి వచ్చాక అవన్నీ మర్చిపోయాను. మంచి ఉద్యోగం సంపాదించగలన్న ఆత్మవిశ్వాసం వచ్చింది. భవిష్యత్‌లో మంచి ఉద్యోగం సాధించి అనాథలకు సేవ చేస్తా.

- పి.సుశాంతి

### ఆత్మవిశ్వాసం పెరిగింది



మాది న్యూ బోయిగూడ. చిన్నప్పుడే మా నాన్న చనిపోయారు. మా అమ్మ ఎంతో కష్టపడి నన్ను పెంచింది. మా అమ్మ ఇళ్లలో పని చేస్తేనే పూట గడుస్తోంది. అందుకే అమ్మకు సహాయంగా ఉదయం, సాయంత్రం వేళల్లో నేను కూడా పని చేసేదాన్ని. ఇక్కడికి వచ్చాక నాకు ఆత్మవిశ్వాసం పెరిగింది. షాదాన్ కళాశాలలో బీఎస్సీ (నర్సింగ్)లో సీట్ వచ్చింది. కోర్సు పూర్తయ్యాక మంచి ఉద్యోగం సాధిస్తానన్న విశ్వాసం వచ్చింది.

- జహంగీర్ బీ

### నేనూ ఫౌండేషన్ స్థాపిస్తా



మాది శ్రీకాకుళం. నాకు అమ్మానాన్న లేరు. యశోద చారిటబుల్ ఫౌండేషన్‌లో శిక్షణ పొందాక నాకు మంచి నమ్మకం కలిగింది. నేను కూడా భవిష్యత్తులో ఇలాంటి ఫౌండేషన్‌ను స్థాపించి నాలాంటి అనాథలకు సహాయం చేస్తా.

- శ్రీను

### మార్పు వచ్చింది



అమ్మానాన్న చనిపోయాక పిన్ని దగ్గర పెరిగాను. పట్నంలో ఏదో పనిచేసుకొని బతకాలని పశ్చిమ గోదావరి జిల్లా నుంచి వచ్చాను. సికింద్రాబాద్ రైల్వేస్టేషన్‌లో భగవంత్ అన్నయ్య కలిశారు. తను నన్ను బీసీ హాస్టల్‌లో చేర్పించారు. అక్కడి నుంచి ఫౌండేషన్‌కి వచ్చాను. ప్రస్తుతం వృత్తి విద్యా కోర్సులో శిక్షణ పొందుతున్నా. గతంలోలా ఇప్పుడు నాలో సంశయాలు లేవు. ప్రతి విషయంపై పాజిటివ్‌గా ఆలోచిస్తున్నా.

- ఎ.అఖిల్ చంద్ర

### ఉచిత శిక్షణ అంటే నమ్మలేదు



మాది దిల్‌సుఖ్‌నగర్. నాన్న చనిపోయాక అమ్మ కష్టపడి పెంచింది. ఇక్కడ ఉచితంగా భోజనం, వసతి కల్పించి శిక్షణ ఇచ్చి, ఉద్యోగం ఇప్పిస్తారంటే మొదట్లో నమ్మలేదు. కానీ, ఇక్కడికి వచ్చాక ఎన్నో కొత్త విషయాలు తెలుసుకున్నాను. ఏదైనా సాధించగలమన్న విశ్వాసం పెరిగింది. మంచి ఉద్యోగం సాధించి నాలాంటి వారికి సహాయం అందిస్తాను.

-ఎం.మాధవి




యశోద చారిటబుల్ ఫౌండేషన్‌లో వివిధ వృత్తి విద్యా కోర్సుల్లో శిక్షణ తీసుకుంటున్న విద్యార్థులు

# అనాథల.. ఆశాజ్యోతి______యశోద చారిటబుల్ ఫౌండేషన్

***అనాథ యువతకు వెలుగు దారి చూపుతున్న వేదిక**

***ఒంటరి జీవితాల్లో విశ్వాసం నింపుతున్న యశోద గ్రూప్ సీఎండీ**

***వృత్తి విద్యలో శిక్షణనిస్తూ ఆదర్శంగా నిలుస్తున్న రవీందర్ రావు**

కష్టసుఖాలు తెలిసిన వారే.. ఇతరుల కష్టాలను అర్థం చేసుకుంటారనేందుకు యశోద గ్రూప్ ఛైర్మన్ అండ్ మేనేజింగ్ డైరెక్టర్ జి.రవీందర్ రావే నిదర్శనం. 'సొంత లాభం కొంత మాని... పొరుగు వారికి తోడ్పడవోయ్' అన్న గురజాడ సూక్తిని

అక్షరాలా

ఆచరిస్తున్న వ్యక్తి ఆయన. యశోద చారిటబుల్ ఫౌండేషన్ స్థాపించి అనాథ యువతకు వృత్తి శిక్షణ అందిస్తున్నారు. మానవ సేవే మాధవ సేవగా భావించి యువతను ఉన్నత శిఖరాల వైపు నడిపిస్తున్న రవీందర్ రావు కృషి ఎందరెందరికో స్ఫూర్తిదాయకం. అనాథ యువతలో ఆత్మవిశ్వాసాన్ని నింపుతున్న యశోద చారిటబుల్ ఫౌండేషన్ విశేషాలు మీకోసం...

*జీవితంలో లక్ష్యం సాధించాలన్న దృఢ సంకల్పం అవసరం. తల్లిదండ్రులు, కుటుంబానికి దూరంగా బతికే మనో ప్రపంచం అత్యంత భయానకంగా ఉంటుంది. జీవితం ఆగమ్యగోచరంగా కనిపిస్తుంది. చుట్టూ ఉన్న సమాజంపై కొన్నిసార్లు కోసం వస్తుంది. ఒంటరితనంలోంచి వివేచన కోల్పోయే స్థితికి చేరుకుంటారు. అలాంటి వారిలో ఆత్మవిశ్వాసం  నింపితే.. సరైన మార్గనిర్దేశం చేస్తే.. ఉన్నత శిఖరాలకు

చేరుకుంటారు. అలాంటి కర్తవ్యాన్ని భుజానికెత్తుకుంది యశోద, చారిటబుల్ ఫౌండేషన్, అనాథ పిల్లలకు ఉపాధి కల్పించి.. వాళ్లు జీవితంలో స్థిరపడేలా ప్రోత్సహించే ఉద్దేశంతో రవీందర్ రావు 2011లో ఈ ఫౌండేషన్ను స్థాపించారు. ఇప్పటి వరకు వేలాది మందికి శిక్షణ ఇచ్చి, ఉపాధి అవకాశం కల్పించిన ఈ ఫౌండేషన్ సేవలను ప్రతి ఒక్కరూ కొనియాడుతున్నారు.

**ఆర్థిక స్వావలంబన ....**

ఇక్కడ శిక్షణ పొందిన వారు ఎలాంటి క్లిష్టపరిస్థితుల్లోనైనా ఇతరులపై ఆధారపడకుండా ఆర్థిక స్వావలంబన సాధిస్తున్నారు. అంతేకాదు.. జీవన గమనంలో ఎదురయ్యే సమస్యలను అధిగమించేందుకు కు అవసరమైన కౌన్సెలింగ్ అందిస్తోంది సంస్థ. ఇప్పటి వరకు 2108 మంది విద్యార్థులు ఈ ఫౌండేషన్లో శిక్షణ పొందగా, 1882 మంది ఉద్యోగాలు పొందారు. ప్రస్తుతం 146 మంది శిక్షణ పొందుతున్నారు. విద్యార్థులకు ఇంగ్లీషు ను బోధిస్తూ వారిలో ఆత్మవిశ్వాసాన్ని పెంపొందిస్తోంది. అలాగే, కంప్యూటర్ పరిజ్ఞానం అందిస్తోంది సంస్థ

**ఆత్మవిశ్వాసం నింపుతాం**

అనాథ పిల్లల్లో ఆత్మవిశ్వాసం నింపి, స్వావలంబన దిశగా వారిని నడిపించేందుకే ఈ సంస్థను ప్రారంభించాం. పదో తరగతి పూర్తి చేసిన 16 నుంచి 20 ఏళ్ల మధ్య వయసు ఉన్న అనాథ యువతకు 65 రోజులపాటు ఉపాధి అనుబంధ శిక్షణ ఇవ్వడంతోపాటు ఉచిత భోజనం, వసతి, ఉపకార వేతనాలు కూడా అందిస్తున్నాం. శిక్షణ పొందిన వారికి ఆస్పత్రులు, బీపీఓ, ఎంయెన్సీ కంపెనీల్లో ఒప్పందాలు కుదుర్చుకుని ఉపాధి కల్పిస్తున్నాం. ఒక్కొక్కరిదీ ఒక్కో నేపథ్యం.. కుల, మత, ప్రాంత బేధాలు లేకుండా ఇక్కడ శిక్షణ పొందుతున్నారు. నైరాశ్యంలో ఉన్న అనాథలను ఆత్మ విశ్వాసంతో తమ కాళ్లపై తాము నిలబడగలిగేలా తీర్చిదిద్దుతున్నాం. సమస్యలను అధిగమించేందుకు అవసరమైన సామకూల దృక్పధాన్ని అందించేందుకు కౌన్సెలింగ్ ఇప్పిస్తున్నట్లు 'యశోద' గ్రూప్స్ఎండీ రవీందర్ రావు వివరించారు.

**ట్యూటర్ల నియామకం**

అనాథశ్రయాల్లో ఉంటూ పాఠశాల విద్యనభ్యసిస్తున్న విద్యార్థుల్లో మెరుగైన ప్రతిభను వెలికితీసేందుకు ప్రత్యేకంగా ట్యూటర్లను నియమిస్తున్నారు. 8,9,10వ తరగతి విద్యార్థులు గణితం, సైన్స్, ఇంగ్లిష్ వంటి క్లిష్టమైన సబ్జెక్టుల్లో మంచి నైపుణ్యం పొందడానికి ట్యూటర్లు దోహదపడుతున్నారు.

10వ తరగతి పూర్తి చేసిన విద్యార్థులు వృత్తి విద్యా కోర్సు అభ్యసించేందుకు ఫౌండేషన్ సహకరిస్తోంది. డీఎంఎల్, ఎంపీహెచ్ డబ్ల్యూ, ఈసీజీ టెక్నీషియన్స్, సీఎస్ఏతోపాటు ఎలక్ట్రిషన్, ప్లంబింగ్, డ్రైవింగ్, కార్పెంటర్ వృత్తుల్లో ఆసక్తిని బట్టి శిక్షణ అందిస్తున్నామని సంస్థ చైర్మన్ రవీందర్ రావు తెలిపారు ఎవరైనా వివరాలు కావాలనుకుంటే https://yashodafoundation.org/ లో సంప్రదించాలన్నారు.

**ధైర్యం వచ్చింది;** మాది అంబర్పేట్, ఇంటర్మీడియెట్ పూర్తి చేశాను. ఇక్కడికి వచ్చాక ఎవరిపై ఆధారపడకుండా నా కాళ్లపై నేను నిలబడగలనన్న ధైర్యాన్ని కూడగట్టుకోగలిగాను. జీవితంలో ఎదగడానికి ఈ శిక్షణ ఎంతో ఉపయోగపడుతోంది. ఇక్కడ సమాజంలో ఎవరితో ఎలా మెలగాలో నేర్పించారు. మంచి ఉద్యోగం సాధిస్తానన్న నమ్మకం కలిగింది. **- పి.మాధురి**

**బాధలన్నీ మర్చిపోయా;** మాది వైజాగ్ చిన్నప్పుడే తల్లిదండ్రులు చనిపోవడంతో మా అత్తయ్యవాళ్ల వద్ద పెరిగాను, అమన్ వేదిక సంస్థ ద్వారా నేను ఈ ఫౌండేషన్లో చేరాను చిన్నప్పటి నుంచి ఎన్నో కష్టాలు అనుభవించాను. ఇక్కడికి వచ్చాక అవన్నీ

మర్చిపోయాను. మంచి ఉద్యోగం సంపాదించగలన్న ఆత్మవిశ్వాసం వచ్చింది భవిష్యత్లో మంచి ఉద్యోగం సాధించి అనాథలకు సేవ చేస్తా.- పి.సుశాంతి

**ఆత్మవిశ్వాసం పెరిగింది;** మాది న్యూ బోయిగూడ, చిన్నప్పుడే మా నాన్న చనిపోయారు. మా.

అమ్మ ఎంతో కష్టపడి నన్ను పెంచింది మా అమ్మ ఇళ్లలో పని చేస్తేనే పూట గడుస్తోంది. అందుకే అమ్మకు సహాయంగా ఉదయం, సాయంత్రం వేళల్లో నేను కూడా పని చేసేదాన్ని. ఇక్కడికి వచ్చాక నాకు ఆత్మవిశ్వాసం పెరిగింది. షాదాన్ కళాశాలలో బీఎస్సీ (నర్సింగ్)లో సీట్ వచ్చింది. కోర్సు పూర్తయ్యాక మంచి ఉద్యోగం సాధిస్తానన్న విశ్వాసం.

వచ్చింది. -జహంగీర్ బీ

**నేనూ ఫౌండేషన్ స్థాపిస్తా;** మాది శ్రీకాకుళం నాకు అమ్మానాన్న లేరు యశోద చారిటబుల్ ఫౌండేషన్లో శిక్షణ పొందాక నాకు మంచి నమ్మకం కలిగింది నేను కూడా భవిష్యత్తులో ఇలాంటి ఫౌండేషన్ ను స్థాపించి నాలాంటి ఆనాధలకు సహాయం చేస్తా.

- శ్రీను

**మార్పు వచ్చింది;** అమ్మానాన్న చనిపోయాక పిన్ని దగ్గర పెరిగాను. పట్నంలో ఏదో పనిచేసుకొని బతకాలని పశ్చిమ గోదావరి జిల్లా నుంచి వచ్చాను. సికింద్రాబాద్ రైల్వేస్టేషన్లో భగవంత్ అన్నయ్య కలిశారు తను నన్ను బీసీ హాస్టల్లో చేర్పించారు అక్కడి నుంచి ఫౌండేషన్కి వచ్చాను. ప్రస్తుతం వృత్తి విద్యా కోర్సులో శిక్షణ పొందుతున్నా. గతంలోలా ఇప్పుడు నాలో సంశయాలు లేవు. ప్రతి విషయంపై పాజిటివ్ గా ఆలోచిస్తున్నా.-ఎ.అఖిల్ చంద్ర

**ఉచిత శిక్షణ అంటే నమ్మలేదు.;** మాది దిల్ సుఖ్ నగర్ నాన్న చనిపోయాక అమ్మ కష్టపడి పెంచింది. ఇక్కడ ఉచితంగా భోజనం, వసతి కల్పించి శిక్షణ ఇచ్చి, ఉద్యోగం ఇప్పిస్తారంటే మొదట్లో నమ్మలేదు కానీ ఇక్కడికి వచ్చాక ఏన్నో కొత్త విషయాలు తెలుసుకున్నాను ఏదైనా సాధించగలమన్న విశ్వాసం పెరిగింది మంచి ఉద్యోగం సాధించి నాలాంటి వారికి సహాయం అందిస్తాను. -ఎం.మాధవి

yashodafoundation.org

Education support for underprivileged children Donate Now



Home About Events Blogs Contact

**BECOME A VOLUNTEER**
Want to help us out? Become a volunteer
Join us Now

**SPONSOR A CHILD**
Give a new life to the already living
Contact us

**GET INVOLVED**
We could always do with more of your help
Know More

**REACH US ON**
040-47766675, +91 9963404620
Contact Now

## We Are Yashoda Foundation

Established in 2007, Yashoda Foundation is a non-profit, volunteer-driven organization set up to empower and enable underprivileged children and create happier communities.

View Details



### Community Learning Centers

Our CLCs focus on augmenting the children's schooling and help bridge any existing learning gaps to prepare them for higher education.As such, we never aim to entirely re...

Read more



### Inspiration Home

Our Inspiration Home for underprivileged children provide them with the food, shelter, and clothing they need alongside ensuring their educational and healthcare requirem...

Read more



### Social Enterprise

We collaborate with farmer collectives and supply organic products to major corporations by working hand-in-hand with their CSR initiatives in an effort to boost social e...

Read more



H.No.12-5-149/13/1,Plot No.143 Vijayapuri Colony, Beside lane of Axis Bank,

**Useful Links**
Home
About
Events

**Quick Contact**
040-47766675
+91 9963404620

**Opening Hours**
Mon-Fri : 8:00 am - 6:00 pm
Sun : Closed



**Call Us**
040-47766675, +91 9963404620



**Email**
contact@yashodafoundation.org



**Address**
Vijayapuri Colony, Beside lane of Axis Bank, Tarnaka, Secunderabad-17 Telangana, India

## Find Our Location




## Got something on your mind?

Name*
Enter Name

Email*
Enter Email

Subject
Enter Subject

Phone*
Enter Phone

Message
Enter Message